కృష్ణాజిల్లా యర్నగూడెం తా॥

తాళ్లపూడి గ్రామవాస్తవ్యులగు

శ్రీమాన్

గోవర్ధనం శ్రీరంగాచార్యులవారిచే

రచియింపఁబడి

రాజశ్రీ అప్పన వెంకట్రామయ్య,

పల్లపోతు శ్రీమన్నారాయణ గార్ల

ద్రవ్యసహాయమున





ప్రథమముద్రణము 500 ప్రతులు.

రాజమహేంద్రవరము

శ్రీవిద్యానిలయముద్రాక్షరశాలలో ముద్రితము

వెల 0—2—0. క్రీస్తుశకం,

శ్రీరస్తు.

శ్రీమద్వైఖనసే నమః

# శ్రీమదనగోపాలకృష్ణస్తవము

## ఇష్టదేవతాప్రార్థనము.

మ. శ్రీమంతంబగు తాళ్లపూడినగరిఁ జెల్వొందుగోపాలనా
మామాంగళ్యగుణాభిరామ పరధామా ప్రోల్లసన్నీరద
శ్యామా శ్రీవనదామ భీష్మకతనూజాసత్యభామామనః
కామా మామకకామితార్థములనిష్టామావెసం దీర్పుమా.

## —§ గురుప్రార్థనము. §—

క. శ్రీవైఖానసశేఖరు
గోవిద సమ్మాననీయు గురుకులవర్యున్
భావమునఁ దలఁతు నిరతము
శ్రీవల్లభభక్తిధుర్యు శ్రీరంగార్యున్.

## —* హయగ్రీవప్రార్థనము. *—

తే. గీ. బోధముద్రారథాంగాబ్జ పుస్తకములు
హస్తపద్మములందొప్ప నబ్జపీఠి
నలరుసర్వవిద్యాధారు నద్వితీయు
నాగధీశుహయగ్రీవు బ్రస్తుతింతు.

## —విష్వక్సేన ప్రార్థనము.—

తే. గీ. శ్రీశసైన్యనాయకు సుర సేవ్యమాను
దివ్యశుచిగాత్రు సూత్రవతీకళత్రు
విమలచరితు విష్వక్సేను వేత్రహస్తు
విఘ్నశాంతిని మదిఁ గోరి వినుతిసేతు.

## —శ్రీమదనగోపాలకృష్ణస్తవము.—

సీ. శ్రీవత్సలాంఛనాంచిత మహోరము వాని
శిఖిపింఛభూషిత శిరము వాని
వర్షాంబుదశ్యామ వర్ణదేహము వాని
వనమాలికను గడు వఱలువానిఁ
గటితటోద్భాసిత కనకచేలమువానిఁ
గరసరోరుహధృత మురళివాని
భువనమోహనదివ్య పురుషరూపమువానిఁ
బూజితోజ్జ్వల పదాంబుజమువాని
తే. గీ. పూర్ణచంద్రునిఁ బోలెడి మొగమువాని
శంఖచక్రాదికలిత భుజములవాని
వర్ణనాతీతచరితంబు వానిహరిని
మదనగోపాలమూర్తిని మదిభజింతు.



# గణనమక దండకము

శ్రీమత్యదూత్తంస దైతేయవిధ్వంస యోగీశహృ
త్పంకజావాసపద్మాసనేశామరేశాదిదిక్పాలకోటీరమాణిక్య
పుంజప్రభాదీప నీరాజితాంఘ్రిద్వయా అద్వయా పుండరీ
కాక్ష నమ్రైకరక్షా విపక్షేభహర్యక్ష శ్రీవత్సవక్షా ధరా
దేవియుర్విం దొల్లి భారమ్ము దానోపఁగాలేక గోరూపయై పద్మ
జుం జేరి కన్నీరుమున్నీరుగా నేడ్వ నాధాత ధాత్రీసురానీకముం
గూడి దుగ్ధోదధిం జేరి శ్రీకాంతునిన్ భక్తి వేదాంతవాక్యం
బులన్ సంస్తుతుల్ సేసి పాలింపవేయంచు వేఁడన్ బ్రసన్న
త్వముం బొంది యోధీరులారా ధరన్ దుష్టులన్ ద్రుంపఁగన్
వాసుదేవుండనై బుట్టి మీకోర్కెలీడేర్తు మీరున్నిజాంశం
బులన్ యాదవుల్గా జనింపంగ శేషుండు నాకగ్రజుండై
జనించున్ యటంచున్ గటాక్షించి కృష్ణాభిధేయంబుతోఁ
గంసుచిత్తంబు భేదిల్ల నా దేవకీదేవిగర్భంబునం దుద్భవంబంది
వ్రేపల్లెలో నందునింటన్ యశోదాఖ్యచేఁ బ్రీతిసంపారఁ
బెంపొందుచోఁ గంసదుర్బోధ లాలించి చన్నియ్యనేతెంచు
నా పూతనాభూతకాంతన్ కృతాంతాతిథిన్ జేయుచున్
బండిరాకాసి బాదాహతిం గూల్చి మాయాతృణావర్తదైత్యున్
తృణప్రాయుగా నెంచి ప్రాణంబులన్ బాపుచున్ దల్లికిన్
నోట మృద్భక్షణవ్యాజమున్ బూని బ్రహ్మాండమున్ జూపు
చున్ వెన్న వేమారు ముచ్చిల్ల నా వల్లవీకామినుల్ నందచం
ద్రాన్యతో నాగడం బెల్లఁ దెల్లంబుగాఁ జెప్ప నిన్బట్టిచట్రో

టకిం గట్టిగన్ దిట్టవై మద్దులన్ నేలఁగూలంగనుం ద్రోచి
బాల్యోచితక్రీడలఁ దేలుచున్ పూర్వగీర్వాణగర్వంబులం
ద్రుంచి బృందావనాంతంబునన్ గోవులన్ గాయుచుండంగ
బృందారకశ్రేష్ఠుఁ డవ్వేళ వ్రేఁపాపలన్ దాచినన్ నూత్న
గోవత్సబాలాళిఁ గల్పించి దివ్యప్రభావంబు జూపించి తీవ్రా
నలాభీలకజ్వాలజాలమ్ముచే గాసినొందించు నాకాళియున్
బట్టి మర్దించుచున్ వాసవుం డల్కఁ బాషాణవర్షంబు వర్షింప
గోవర్ధనాహార్యమున్ గేల దివ్యాతపత్రంబుగాఁ దాల్చి రా
ధాదిగోపాంగనాపాళి స్వచ్ఛందవృత్తిన్ జలక్రీడ గావించు
వేళన్ దదీయాంబరవ్రాతమున్ దెచ్చి తత్సుందరీచిత్తచోరుం
డవై యాశరచ్చంద్రికాధౌతభాస్వత్సుతాసైకతశ్రేణులం
జేరి వంశంబు పూరింప తద్గీత మాలించి నయ్యంచువిల్కా
నికిం జిక్కి వెన్మక్కువల్ మొల్కలెత్తంగ వే తత్తరం బందు
చున్ భర్తలన్ బంధువర్గంబులన్ వీడి నీసన్నిధిం డాసినన్
వారితో రాసక్రీడాదులన్ సల్పుచున్ గంససందేశమున్ దెల్పి
యక్రూరుఁడున్ మిమ్ముఁ గొంపోవుచో వానికిన్ విశ్వరూ
పంబు జూపించి మన్నించి తద్రాజధానిం బ్రవేశించి కుబ్జా
దులన్ బ్రోచి చాణూరవీరాదులన్ జంపి యంతన్ త్రిలోకీ
నృశంసుండునౌ కంసు హింసించుచున్ దల్లికిన్ దండ్రికిన్
మామ నిర్బంధనల్ మాన్పి యయ్యుగ్రసేనున్ మహీపాలునిం జేసి
సాందీపుశిష్యుండవై విద్యలన్నేర్చుచున్ దుర్మదాంధున్ జరా
సంధునిన్ గాందిశీకున్ దగన్ జేయుచున్ సింధుమధ్యంబునన్
ద్వారకన్ లీల నిర్మాణమున్ జేసి సాళ్వాదులన్ జైద్యులన్
గెల్చి వైదర్భినిం దెచ్చి సాత్రాజితీమిత్రవిందాది నారీకురస్త్రీ

కృతిన్ సంతసంబందుచున్ మేదినీసూనునిన్ తీవ్రదుర్వార
చక్రమ్ముచే ద్రుంచుచున్ నందనారామసంజాతమౌ పారి
జాతంబునుం దెచ్చి ప్రీతిన్ బదార్వేలభామామణుల్ గొల్వ
ఖేళిల్లుచున్ వింతగన్ దంతవక్త్రాదిదుష్టాళినంతంబుగావించి
కౌంతేయపక్షంబునందుండి సూతుండవై క్రీడికిన్ యోగశా
స్త్రంబు బోధించి తచ్ఛంకలన్ బాపి యాధార్తరాష్ట్రాదులన్
దండభృల్లోకయాత్రికులన్ జేయుచున్ యాదవశ్రేణికన్యో
న్యవైరంబుగల్పించి విశ్వంభరాభారమెల్లన్ వినాశంబు
గావించుచున్ దేవతాదుందుభిస్తోమ ధిమ్మి ధిం ధిమి
ధ్వానముల్ గల్పకద్రుప్రసూనప్రవృష్టుల్ సెలఁగన్
జగంబెల్ల నుల్లాసమున్ బొంద బ్రహ్మాదులెల్లన్ స్తుతుల్
సేయ తార్క్ష్యాధిరూఢుండవై కోటిసప్తాశ్వసంకాశతేజం
బుతో దివ్యవైకుంఠధామంబునుం బొంది భక్తుల్ సదా నిన్ను
సేవింపఁగన్ బూర్వరూపంబునం ధాత్రినర్చావతారుం
డవై విశ్వసమ్మోహనంబౌ త్రిభంగ్యాకృతిన్నిల్చి యాకుంచి
తభ్రూవిలాసంబుతో మోము వామాంసమున్ జేర్చి హస్తా
రవిందద్వయిన్ వేణువున్ దాల్చి శ్రీరుక్మిణీసత్యభామాఖ్య
నిర్వంకలంగొల్వఁ జెల్వొందు నీవాఙ్మనోగోచరాత్యద్భు
తానంత కల్యాణచారిత్రమున్ వర్ణనల్ సేయ వాగీశ గౌరీశ
దేవేశ నాగేశ మౌనీశ్వరాదుల్ సమర్థత్వమున్ బొందరే
నెంతవాఁడన్ సదాచారదూరుండ బుత్రాంగనా బంధుమి
త్రాది యాదోగణాకీర్ణ సంసారవారాశిలోమున్గి యాశామ
హావర్తవృత్తుండనై యుండి మోహాంధకారంబు వ్యాపింప వి
జ్ఞానతీరంబునుం గానఁగాలేక యున్నాఁడ నిన్నే మదిన్నమ్మి

దుర్ధాంతపాపౌఘనిర్ణాశకాంభః ప్రవాహోద్భగంగానదీజన్మది
వ్యాలయుండౌ భవత్పాదపద్మద్వయిన్ నాయథాశక్తిసత్స్వం
తు సన్నికృపాదృష్టినీక్షించి పాపంబులందుంచి లోపంబుమ
న్నించి సత్సంపదన్నిచ్చి కైవల్యలక్ష్మిం బ్రసాదించి రక్షింపు
మో దేవ దివ్యప్రభావా లసత్తాళ్లపూడీపురీపాల శ్రీలోల
గోపాలకృష్ణా నమస్తే నమస్తే నమః॥



# దశావతారస్తవము



మ. ప్రళయంబొప్పఁగఁ గల్పకాంతమున నన్నిద్రం జెందుచుండఁగ మ
హో। త్పలజాతుండు తదాస్యసంజనిత వేదశ్రేణిఁ గొంపోవు
చున్। జలధిం డాగఁ దైత్యుఁ జంపి హితుఁడై సత్యవ్రతున్
బ్రోచె నా। జలజంతూకృతి వాని నేఁ దలఁతు సంసారాంబుధిం
దాటఁగన్.

మ. సుధపూర్వామరసంఘముల్ బిసునకై వాోద్యంబుగన్ ద్రచ్చు చో
గిరి కూలంబడినంతఁ బౌరుషము సంధించి జంతించ మం
దరమున్ దానవలీలనుత్తిసరణిన్ ధైర్యంబుతో నెత్తినా
హరి కూర్మాకృతిని దలంచెదను నేనాయుర్యశోవృద్ధికై.

మ. అవనిన్ బాతాళపరాక్రమోన్నతి హిరణ్యాక్షుండు మున్
జాపచుట్ట దాఁగొనిపోవఁగాంచి ఘనదంష్ట్రాగ్రాహ
తిం గున్నియు। ర్ణవమగ్నోర్విని నుద్ధరించి దివిజానందంబు
గల్పించ యు। జ్ఞవరాహాకృతిదాల్చు వానిదలఁతున్ జ్ఞానో
దయంబందఁగన్.

మ. హరిభక్తుండు నిజాత్మజుండు సుప్రహ్లాదున్ బెల్వెట్టుచున్
సురమానీశ్వర సాధులోకసమితిన్ శిక్షించుచున్ సర్వభీ
కరుఁడౌ రాక్షసపున్ హిరణ్యకశిపున్ ఖండించి లోకంబులన్
గరుణంగాంచిన శ్రీనృసింహుఁ దలతున్ గష్టంబులన్ గావగన్.

మ. బలిచే రాజ్యము గోలుపోవు శతజంభారాతి నింకోర్వఁగన్
బలభిత్సోదరుఁడై నుతింపవడుగై పాదాగ్ర యోర్విన్నయం
బరరం గోరి విరించనాత్మజ బ్రహ్మాండంబు దానిండుచున్
బలిబంధించిన వామనుం దలఁతు సౌభాగ్యంబులన్ దేలఁగన్

మ. హరిలీలం జమదగ్నిమౌని తనయుండై కార్తవీర్యాదులం
బోరిమర్దించి కుఠారధార హతిన్ మత్యేంద్రు మారుల్మహీ
పరవంశంబు వధించి భూతలము విప్రశ్రేష్ఠులకిచ్చు ధీ
వరుఁడౌ భార్గవరాము భక్తిఁ దలఁతున్ బ్రత్యగ్నినాశంబుకై.

మ. అమరానీకము గుందజేయు దితిపుత్రాళిన్ వెసన్ద్రుంచగన్
గమలాప్తాన్వయమందుఁ బుట్టి ధరణీకన్యాకరస్వీకృతిన్
బ్రియమొందం బందిధనుఃప్రకాండధరుడై పంక్త్యాస్యవంశంబు భ
గ్నముగావించిన రాఘవుం దలచెదన్ కైవల్యలోకాప్తికై

మ. వసుదేవప్రియపుత్రులై యదుమహావంశంబునం బుట్టుచున్
బసులంగాయుచు లీలవల్లవతతిం బాలించుచున్ క్రూరమా
నసులౌ వైరుల ద్రుంచి భూమిభరమున్ నాశంబు గావించి సం
తసముం బొందిన రామకృష్ణులకు నిత్యంబంజలిం జేసెదన్.

మ. అతిప్రీతిన్ శ్రుతి సేయ దేవతతి మాయామోహుండై దైత్యులు
ద్ధతి సద్ధర్మపథానువర్తులగుటం దా జైనశాస్త్రార్థనం
హతి బోధింపగ ముక్తకర్మచయులై యాదానవాళిన్ యుధ
గతి బాల్ సేసిన బుద్ధమూర్తిదలతున్ గౌతూహలంబొప్పగన్.

మ. ధరణిన్ విప్రతనూజుండై కలియుగాంతంబందనాచారులన్
బరనారీధనలోలురన్ బతితులన్ బాషండులన్ వర్ణనా
కరులన్ గ్రూరుల ద్రుంచుచున్ సుజనులం గాపాడుచున్
ధర్మమున్ బరిపాలింపగనున్న కల్కిం దలంతున్ బాపంబులన్
బాపంగన్.

సమాప్తము



# శ్రీకృష్ణస్తవము

మ. శ్రీకృష్ణా యదువంశభూషణ వ్రజస్త్రీమానసాకర్షణా
శత్రుద్వేషణభీషణా యమితసంసారాబ్ధిసంశోషణా
లోకేశాశ్రితపోషణా వరకృపాఘా సత్యసంభాషణా
నీకున్ మ్రొక్కెద నిష్టసిద్ధికి సదా నీరేజపత్రేక్షణా.

శా. భూపా దేవకిగర్భశుక్తివిలసన్ముక్తామణీ ధీమణీ
పాపధ్వాంతవినాశకృద్దినమణీ భక్తౌఘ చింతామణీ
యాపద్బాంధవ దేవతాగ్రణి ప్రపన్నానీకరక్షామణీ
గోపంబెంతయుమాని బ్రోవుము దయన్ గోపాలచూడామణీ

మ. హరిదేవుండని కొందఱున్ దలఁపగా నశంకరుండంచు గొం
దఱు బల్కీశులఁ బూజసేతురు సమస్తాత్మాంతరవ్యాపి వౌ
టరయన్నొక్కరుఁడే వెకా వివిధభూషాకారముల్ బొందు
చున్ ధరభాసిల్లెడి హేమముల్ల పరమాత్మా వేణుగోపాలకా.

శా. మాయానిర్జితలు బొమ్మలవలెన్ మమ్మాటలాడించు నన్
మాయానాటకసూత్రధారివయి బ్రహ్మానందముం బొందు నీ
మాయన్ మించఁగ నేర్తురే విధిశివామర్త్యుల్ మహామానివా
గ్రేయా భక్తనికాయపాలనదయా కీర్తింతు నిన్నెప్పుడున్.

మ. భవదీయాద్భుతసత్కథాసుధను దేవా గ్రోలు మచ్చిత్తమీ
భవఘోరార్ణవదుఃఖజాలలవణాంభఃపానముం గోరునే
దివిజోద్యానవనస్థలిం దిరుగు మత్తేందిందిరం బారయన్
భువి నాశించునె వేపచెట్లఁ దిరుగన్ బూదేనెకై శ్రీధరా.

లమత్తానవదాత్మజాకుండు వశిష్ఠమాత్యదుర్వాశ్యసం
కులవంజాతవిషాదచిత్తుండగుచున్ ఘోరాటవిన్ వచ్చి వి
శ్చలభక్తిం దపమాచరింప విలసత్సర్వోన్నతస్థానమున్
జెలువొప్పారగనిచ్చువానిందలంతున్ శ్రేయఃపదప్రాప్తికిన్

కరినాథుండొకవేళ ఘోరమకరగ్రస్తాంఘ్రియై పెక్కువ
త్సరముల్ పోరంగలావుదక్కి మదిలో ధ్యానించుచున్ దీన
న్ మొరబెట్టంగృపనాలకించిమకరంబుందుంచిచక్రమ్ము
న గరిరక్షించిన దేవదేవుందలంతున్ గాపాడనెల్లప్పుడున్.

ననిందుర్యల్ ధృతరాష్ట్రసూనులుసభాస్థానంబునన్ బాం
వాంగనవస్త్రంబులూడ్చుచో నధికదుఃఖాక్రాంతయై
ష్ణా దాక్షిణమందతెసయవస్త్రదానమున నాకాంతామణి
మానరక్షణముంజేసిన దీనబంధుందలంతున్ కల్యాణము
ప్పొందగన్.

డువంగూడును గట్ట గుడ్డ నిలువంగూడైన లేకున్నచో
మలోబొందుకుచేలకుండనునఖుం డేతెంచిచూడంగదా
కొండయ్యటుకుల్ భుజించి పరమప్రీతిన్ వెనన్ వానికిం
భాగ్యంబులనిచ్చువానిందలతున్ గామ్యార్థసంసిద్ధికిన్.

ణీదేవులకర్థభూరినకగోదానామున్ జేయుచున్
ఘుండయ్యును శాపకారణముచే నిర్వ్యాలికారూపంబునన్
టంబైవడియుండినా నృగుమహీజానిన్ కరస్పర్శచే
హ్మారునిఁజేయువానిందలంతున్ బూతాత్మున్ జేయగన్

మ. ననుబల్లటవ్రములందుఁ ద్రోచి వను శ్రీనాథార్పి దంఘ్రిద్వ
యంబు పూజించుట మానియుండనునో శఫ్వాండున్ క్షుధం
న్నుబాలనుదారివం జను బాలుని దొలఁగఁద్రోయు దం
దల్లి దాఁగినట్లో జనునే మాకృపదంబు వీడి జగతిన్ సర్వే
శ్వరా శ్రీవరా.

మ. అనిశంబున్ మదిలోన నిల్పగను పత్రిష్ఠోదుండనా నజ్జనుల్
వినుతింపన్ దపమాచరింపధృవుడన్ విజ్ఞానినా ధీరతన్
నినుధ్యానింపఁగపీంద్రునాకరము వర్ణింపంగ వ్యాసుండనా
ఘననిర్హేతుకజాయమానకరుణన్ గాపాడ వేమాధవా.

శా. పాపాత్ముండనపండితుండనతిగర్వాంధుండదుర్మార్గుఁడన్
కోపిన్ గామవశుండ చంచలమతిన్ గ్రూరుండ సంసారసం
తాపిన్నాదుమహాపరాధముల రాధానాథ సైపంగదే
నీపాదాంబుజమే శరణ్యమిక నన్నేరీతిరక్షింతువో.

మాలిని. శ్రితజనపరిపాలా సింధుకన్యావిలోలా
ధృతవరవనమాలా దీప్తసౌవర్ణచేలా
జితదితిసుతజాలా స్నిగ్ధజీమూతనీలా
వితతసుగుణశీలా వేణుగోలబాలా.

ఫలశ్రుతి

క. ముదమెప్పగనస్తవమునుఁ
జదివినవారలకుమదనజనకుండు సదా
హృదయేప్సితము లొసంగును
వదయత హరియించుమరియు సర్వాఘములన్.

ఉ. ఇలనుత్తానపదాత్మజాతుండు నపత్నీమాతృదుర్వాక్యసం
కలనాజాతవిషాదచిత్తుఁడగుచున్ ఘోరాటవిన్ జొచ్చి వి
శ్వలభక్తిం దపమాచరింప విలసత్సర్వోన్నతస్థానమున్
జెలువొప్పారగనిచ్చువాఁడలఁతుఁ ద్రిశ్రేయఃపదప్రాప్తికిన్.

మ. కరినాథుండొకవేళ ఘోరమకరగ్రస్తాంఘ్రియై పెక్కువ
త్సరముల్ పోరఁగలావుదక్కి మదిలో ధ్యానించుచున్ దీన
తన్ మొరబెట్ట గృపనాలకించి మకరంబున్ ద్రుంచి చక్రమ్ము
చే గరిరక్షించిన దేవదేవుఁదలఁతున్ గాపాడ నన్నెప్పుడున్.

మ. జననిందార్హుల ధృతరాష్ట్రసూనులు సభాస్థానంబునన్ బాం
డవాంగనవస్త్రంబులూడ్చుచో నధికదుఃఖాక్రాంతయై
వేడఁ దాక్షిణమందక్షయవస్త్రదానమున నాకాంతామణీ
మానరక్షణముం జేసిన దీనబంధుఁదలఁతున్ గల్యాణము
లొందఁగన్.

మ. గుడువంగూడును గట్ట గుడ్డ నిలువంగూడైన లేకున్నచో
నిడుమల్ పొందుకుచేలకుండనునఘుం డేతెంచి చూడంగఁదా
బిడికెండటుకుల్ భుజించి పరమప్రీతిన్ వెసన్ వానికిం
గడుభాగ్యంబులనిచ్చువాఁడలఁతున్ గామ్యార్థసంసిద్ధికిన్.

మ. ధరణీదేవులకర్థభాకనకగోదానాదులన్ జేయుచున్
నిరఘుండయ్యును శాపకారణముచే నిర్వ్యాలికారూపంబునన్
సరటంబై పడియుండెనా నృగుమహీజానిన్ కరస్పర్శచే
బునహాకారుని జేయువాఁడలఁతున్ బూతాత్మునింజేయఁగన్

మ. ననుబల్లాట్టములందుఁ ద్రోచివను శ్రీనాథాత్మ ?వఁ ఘద్వేష
బును ప్రూజిఁచుట మానియుండననో శవ్వాండున్
న్ను బా। లనుదాత్రివం బహు బాలుని ందోలఁగఁదోత్రిస్తుధఁ
వల్లి దాఁగిస్థితోఁ। బనునేమాత్మపదంబువీకిబగలిన్ సర్వే
శ్వరా బోత్రివరా.

మ. అనిశంబున్ మదిలోన సల్పగనువత్రిష్ఠోదుండనానజ్జనుల్
వినుతింపన్ దపమాచరింపధృవుడన్ విజ్ఞానినాధీరతఁ
నినుధ్యానింపఁగ పీంద్రమనాకరమువర్ణింపంగవ్యాసుండనా
ఘనని ర్హేతుకజాయమానకరుణన్ గాపాడవేమాధవా.

శా. పాపాత్ముండనపండితుండనతిగర్వాంధుండదుర్మార్గుఁడన్
కోపిన్ కామవశుండ చంచలమతిన్ గూత్రియుండ సంసారనం
తాపిన్నాదుమహాపరాధముల రాధానాథ సైపంగదే
నీపాదాంబుజమే శరణ్యమిక న న్నేరీతిరక్షింతువో.

మాలిని. శ్రితజనపరిపాలా సింధుకన్యావిలోలా
ధృతవరవనమాలా దీప్తసౌవర్ణచేలా
జితడితినుతజాలా స్నిగ్ధజీమూతనీలా
వితతిసుగుణశీలా వేణుగోలబాలా.

ఫలశ్రుతి

క. ముదమొప్పగనస్తవమును
పదివినవారలకుమదనజనకుండు నదా
హృదయేప్సితము లొసంగును
నదయతహరియించుమరియు నకలాఘములన్.

గద్య. ఇది శ్రీదాశేయసాంత్ర గౌతమగోత్రపవిత్ర గోవ
ర్ధనకులకలశజలధిరాకాకైరవమిత్ర గోపాలాచార్య
ప్రియపుత్రుండును భద్రగుణభాసమాన సుభద్ర
మాంబాగర్భశుక్తిముక్తాఫలుండును మదన
గోపాలపదపద్మనిత్యసేవాసమాలబ్ధకవితో
దయుండును విబుధవిధేయుండునగు
శ్రీరంగాచార్యాభిధేయునిచే
రచియింపఁబడిన శ్రీమదన
గోపాలకృష్ణస్తవము
సర్వము సంపూర్ణము.

విద్యానిలయముద్రాక్షరశాల: రాజమండ్రి. 1920.

# ప్రకటన



త్వరపడుడు!　　　త్వరపడుడు!



శ్రీమదుభయవేదాంతప్రవర్తకులగు గోవర్ధనం శ్రీరంగాచార్యులవారిచే వ్రాయబడిన ఋతుషట్కవిలాసమను చిన్నపద్యకావ్యము అచిరకాలమున ముద్రింపఁబడును. కొద్దిప్రతులుమాత్రమే వేయబడును. సులభశైలిని పద్యములింపుగను రసవంతముగ నుండును. ఇందు షడృతువు లుచితముగ వర్ణింపఁబడెను ఆలస్యముచేసిన దొరకుట దుర్లభము. వలయువారలు గ్రంథకర్తగారిపేరగాని లేక ఈక్రిందివిలాసమునకుగాని వ్రాసిన నందగలరు.　　వెల రు 0—4—0

ఇట్లు
అప్పన వెంకట్రామయ్య
తాళ్లపూడి,
కృష్ణాజిల్లా.

—శాల: రాజమండ్రి. 1920.